M. No Reg. 2580.

సం॥ చందా రు 4 లు




జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు

సంపుటము 2 | శనివారము 11-3-33 నెల్లూరు | సంచిక 27

# ఆర్థికా దర్శనములు.

—:o:—

( ఒక సాంఘికుడు. )

గతసంచికానుబంధము.

వారికిపరిరిండితియుండదు. ఒకవ్యాపారములో బుద్ధికుశలతను, యనుభవమును సంపాదించినవారుఅట్టి పనినే చేయుచేస్తురుగాని మరేపనిలోను అంత బాగుగ తన బుద్ధికుశలత నుపయోగింపలేరు. కావున పనిచేయువారికిటిడి వ్యాపారస్తుల యొక్కయు వారి ప్రతినిధులయొక్కయు యధీనము గ చేయుటచే, ప్రజలకు ఎక్కి హానికల్గునది. సంఘము వ్యాపార నిపుణాగ్రలవారికి నేర్పు బుద్ధికుశలత సరిగా యుపయోగించు కొనకుండుటచే, వచ్చు నష్టమును యూహించవచ్చును. యర్యంతధికారము కల్గియుండుటచే, యట్టివారికి సంకుచితాభిప్రాయము యేర్పడును. వారికి సంఘాభివృద్ధికీవలయు యున్నతాభిప్రాయములు పోయి మనోదౌర్బల్య మేర్పడును. యిట్టివారు వ్యాపారము నడుపుటచే వ్యాపారాభివృద్ధికి భంగము కల్గెను. యిదియిట్లుండ పనిచేయువారు బానిసలకన్న హీనముగా చూడబడుటయు, వారిమనసులలో ! ధానిపత్యము హెచ్చి మానవత్వము యాత్మగౌరవమును క్షీణించి మనుష్యత్వంపమునకును, సంఘమునకును, మితిలేని హానికల్గుచున్నది.

యిట్టివ్యాపారపద్ధతులనుండి పనిచేయువారిని రక్షించుటకు పనిచేయువారందరును, సంఘములేర్పరచిరి. వీరు కలసి పనిచేయుచు కూలివాండ్లపార్టీలను స్థాపించుటకును, వారియార్థికస్థితిని బాగుపరచుటకును, పనిచేయుచున్నది. వీనివలన కూలివారలకు కొన్ని దేశములలో మేలుకల్గినది. వీరు కూలివారలకుహానికలుగుచున్నదని సూచనలు కన్పించుచున్నప్పుడు సమ్మెగట్టి పనిని నిల్పుటచేతను, వారిసాంఘిక బలముచే నెవ్వరిని పనిలోనికి పోనివ్వకుండుటచేతను, వీరిపార్టీలుకొన్ని స్థాపించుకొనిరి. వ్యాపారము నడుపుటలో పనివారికి పూర్తియధికారముండవలెనని పార్టీలవారు పోరాటుబడుచున్నారు. కాని, వ్యాపారస్తులను, వారిప్రతినిధులును, శాసన సభలలో హెచ్చుగాయుండుటంజేసి వీరు, ప్రభుత్వమువారప చేయుచున్న యీపనివారి సంఘములకు హానికలుగజేయుచు యీసంఘముల యధికారమును తగ్గింపజూచుటకు, ప్రభుత్వమువారు కొన్ని దేశములలో వ్యాపారస్తులకును వారియనుచరులకును సహాయపడుచుండిరి. శాసనసభలలో వారియనుచరులు లేకపోయినను మిగిలిన శాసనసభ్యులకు ధనలాభమును యితరలాభములును కల్గజేసి తమపక్షమునకు యీవ్యాపారస్తులు మరలుచ్చుకొనుట కొన్ని దేశములలో జానవచ్చును. సాధారణముగ ధనవంతులను సామాన్యజను లనుసరించుట మనముచూచుచున్నదే. వారినసుసరించుటచే సామాన్యులకు ధనసహాయము కల్గుటే గాక వారిపట్ల

సంఘమునకు నలగౌరవము హెచ్చును. వారిబలముకూడ హెచ్చును. దానివలన శాసనసభ్యులను తమవంకకు దల్చుకొనుటచే యీనాడనేకములు ప్రభుత్వవిధానములు తమకనుకూలముగ నుండునట్లుచేసికొనిరి. దానివలన తమయొక్క యధికారమునెమ్మది పనివాండ్లను, వారిప్రతినిధులను, వారిసంఘములను యంగీకరింపక తప్పకుండిరి. దీనివలన పనివారలు వారిప్రతినిధులను శాసనసభలకు పంపుటకును మొదలిడిరి. దీనివలన కొన్ని దేశములలో పనివాండ్ల ప్రతినిధులు శాసన సభలలో ఎక్కువ స్థానముల నాక్రమించిరి. వీరిప్రతినిధులే కొన్ని దేశములలో ప్రభుత్వస్థానములాక్రమించి మంత్రివర్గమందుండిరి. దీనివలన పనివాండ్లకు ప్రభుత్వమువారివల్ల నింతవరకుండు హానితగ్గినను యింకను కార్మికులయాదర్శములు పూర్తిగ యాచరణలోనికి యున్న దేశములలోను రాలేదు.

కాని యార్థికాదర్శనములు మారినవి, మారుచున్నవి. యింకను మారనున్నవి. వక దేశములోని వస్తుసముదాయము ఆదేశముయొక్క ప్రజలకెల్లగకును. దరిదాపు సమానానుభవమునకును యున్నవనియును ఆవస్తు సముదాయముపై దేశములోని ప్రజలకెల్లరకును హక్కుగలిగియుండవలెననుసిద్ధాంతములు ప్రబలినవి. ఎల్లరి తరఫునను రాజొక్కడే పరిపాలింపవలెనను సిద్ధాంతము సరిగ యుండలేదు. రాజుమంచివాడగు నెడల కొంతము ప్రజాక్షేమము కలిగినను రాజుచెడ్డవాడై స్వలాభాపేక్ష గలిగి యున్న యెడల ప్రజలకు గల్గు హానియపారము. ఒక్కడే ప్రజలతరఫున యార్థిక కార్యక్రమము నడుపుటవలన ప్రజలకు ఎల్లపుడును మేలుకలుగుటలేక పోయెను. అటువెనుక భూస్వాములు రాజకీయ రంగమందు ప్రవేశించి రయితులను తమ కూలివారుగను బానిసలుగ జేయుట చేతను వ్యవసాయము యభివృద్ధిచెందలేదు. హెచ్చుతక్కువలు వృద్ధిచెంది ప్రజల యార్థిక మానసిక నైతిక దౌర్బల్యమునకు తోడ్పడెను. అందువల్ల ఆ విధానమువలన సంఘమునకు నిరంతర క్షేమము కలుగలేదు. ప్రజలలో చాలమందిలో బానిసత్వము హెచ్చగునెడల బానిసలపై యధికారముకలవారి కట్టి నిర్మాణము తాత్కాలిక లాభము కల్గించునేమోగాని మయ్యది సాంఘిక క్షేమమునకు తోడ్పడజాలదు. పనిచేయువారలు స్వాతంత్ర్యముగలవారైయుండి తమబుద్ధి శక్తులను నుపయోగించుటకు యవకాశముండి వారికివచ్చు వపమానము వారికి సరిపోవునట్లుగయుండి వారిదేహారోగ్యములు పెంపొందించుటకు యవకాశములుండి వారికి సరియైనవిద్య కల్గుటకు యవకాశములుండి సంఘము ప్రజాసమత్వము యార్థిక రంగమందు పూర్తిగయున్నపుడే వ్యవసాయమభివృద్ధిపొంది దేశసౌభాగ్యమునకు తోడ్పడునేగాని ఎప్పుడును భూస్వామియుండుటగాని లేనకు యప్పిచ్చిన షాహుకారు యొద్ద గాని కృంగిపోవుచు భయపడెడువారై బానిసత్వము పూర్తిగ కలిగి నప్పుడు దేశ యౌన్నత్యము పెంపొందజాలదు.

వ్యాపారస్తులు రాజకీయ రంగమందు ప్రవేశించి, తమవ్యాపారములు నిరాటంకముగ లాభములు హెచ్చింపనుద్దేశముచే వక్కయాదర్శకముగ నుంచుకొని యార్థిక వ్యాపారములు నడిపి లోకక్షేమమునకు తోడ్పడునను సిద్ధాంతము కూడ సరిగాదని తెలిసినది. వ్యాపారము హెచ్చగుకొలది వ్యాపారస్తులు వారి యనుచరులును ధనవంతులై ధనము వారివద్ద నేచేరి వారు యుల్లాసములందు మునిగి యొకవంక యుండ, బీదతనము హెచ్చి కూలివారల యార్థిక దుస్థితి దుర్భరమై పనిలేనివారు తిండికిలేక యల్లాడును వారిసంఖ్య దినదినాభివృద్ధిగాంచి సంఘములో కొంత స్వల్ప సంఖ్యాకులదయపై యధిక సంఖ్యాకుల జీవితములు యాధారపడి పనిచేయువారు భయమనస్కులై బానిసలై యించుకయైన యాత్మగౌరవము లేకుండునట్టి పరిస్థితులేర్పడుచుండ సంఘక్షేమమున్నదనిగాని సంఘముయున్నతస్థితికి వచ్చుచున్నదని గాని మనము చెప్పలేము.

సంఘవ్యవహారములు కొందరి లాభముకొరకే నడుపబడుచున్నప్పుడు అన్ని శాస్త్రములును వారికనుకూలముగనే యుండవలెను. అట్టి విధము యనుసరించు శాస్త్రములనే వారు ప్రోత్సహింతురు. దానికి ప్రతికూలమగు యభిప్రాయముల కోర్చుమాయుదురు. వారి పుస్తకములను బైటకు రానివ్వరు అట్టివ్రాతలు వ్రాయువారిని ప్రభుత్వ సహాయమున దండింపజేయుదురు. యింతియేగాదు కేవలము మనుష్య ప్రపంచకమునందేగాదు. చీమలలోను, జంతువులలోను, వస్తువులను సంగ్రహించు గుణమున్నది. యీ ధనవంతుల పద్ధతుల నైసర్గికములు వీరిమార్గములు సృష్టివిధానానుగుణ్యములని చెప్పుటకు శాస్త్రములను త్రిప్పి వ్రాయుదురు. దేముడే సర్వబలవంతుడని చెప్పుచు తదనుగుణ్యముగ పుక్కిటిపురాణముల వల్లి వీరివిధానములు వీరిమార్గములు దైవసమ్మతములనియును నైతికములనియును చెప్పి మహా గ్రంథములను సృష్టిచేయుదురు. దీనివలన శాస్త్రముయొక్క సత్యాన్వేషణ పోవును. మనుష్యుల బుద్ధి కుశలతే క్షీణించును. కవిత్వము చిత్రలేఖనము శిల్పము మొదలగు మహాకళలు అసత్యములగునట్టియు నిజమగు సౌందర్యములేనట్టియు నిరంతరమహానంద దాయకములు కానట్టియు నిస్సారములైనట్టి కళలుగా మారినవి. యిప్పుడు కళాభివృద్ధి యుండలేదాయని కొందరందురు. సత్యములో ఒక మహాశక్తి యుండినందువలననే ఎట్టియాటంకములున్నను అచ్చటచ్చట కవిత్వము మొదలగు మహాకళలు నిల్చియున్నవి. కాని కళలను పేరిట ఎట్టి పనికిరాని పద్దములు చిత్తరువులు శిల్పములు నానుటలేదు. ప్రజలలో యార్థిక స్వాతంత్ర్యముండి భయముతగ్గి మానసిక వికాసమునకు యవకాశములు పూర్తిగయున్న యెడల కాళిదాసువంటి కవులింక యెందరు దైవ యమూల్యావతారులుగ యుండెదరు. వ్యాపారవిషయమన్నచో వ్యాపారముకూడ హెచ్చును. వ్యాపారములో యిప్పుడున్న మోసము తగ్గును. కక్షలవలన ప్రజల యారోగ్యములకు గలుగు హాని పూర్తిగ తగ్గును. యిప్పుడున్న దుర్భిక్షములెల్లరును మనుష్యులై తేజోవంతులైయుందురు. యిట్టి యాదర్శకములకొరకే దేశములోని వస్తువులెల్లరికిని దరిదాపు సమానముగ యుపయోగపడునట్లుండవలెను. ప్రజలకు దేశములోని వస్తుసముదాయముపై సమాన హక్కులుండవలెను. అట్టి యాదర్శకము ననుసరించుటకే ప్రభుత్వము ప్రజాస్వామికమై దేశక్షేమమును ముఖ్యాదర్శనముగ యుంచుకొనవలెనటు.

# స్ఫోటకమునకు చికిత్స.

నెల్లూరు వెంకటాద్రినాయుడు.

| | |
|---|---|
| కాకరాకుపసరు | 2 ఔన్సులు. |
| చిట్టాముదము | 1 ,, |
| పసపుపొడి | 1 ఫలము |
| ఉప్పు | 1 ఫలము. |

పై వస్తువులు కలిపి, స్ఫోటకజ్వరమువచ్చిన వెంటనే యిచ్చిన యెడల, స్ఫోటకముపోయకుండా పోవును. అథవా పోసినను అతిస్వల్పముగా పోయును. మలుపుకాపక ముందు యివ్వవలెను ఒక పూటకంటె జాస్తి యివ్వనగత్యములేదు. వాంతి, విరేచనములుగాని, కేవలవిరేచనములుగాని యగును. స్ఫోటక జ్వరముగాక మరేజ్వరమైనయినను ప్రమాదములేదు. అనుభవములో యీ మందు అద్భుతముగా గుణమిచ్చినది. మలుపుకాపిన వెనుక ఈ మందు యివ్వకూడదు.

కండ్లలో పోయకుండుటకు — స్ఫోటకము మలుపుకాపిన వెనుక గోరింట ఆకును నీటితోనూరి అరికాళ్ళకు దట్టముగా పట్టువేసిన కండ్లలో స్ఫోటకము పోయదు.

## గుంటలు పడకుండుటకు.

స్ఫోటకము పోసిన వారికి ఆపొక్కులకు ప్రథమమునుండి చివర వరకు వేపచమురు కోడి రెక్కతో పట్టించుచుండిన స్ఫోటకపు గుంటలు, మచ్చలు కనుపడకుండా పోవును. దీనిని చాలా మంది వాడి గుణము కనుగొనియున్నారు.

# నెల్లూరు జమీన్ రైతు మహాసభ.

—(o)—

ఏప్రిలు 2 తేది జరుపు ప్రయత్నమున జరుగును.

అధ్యక్షులు, సామి వెంకటాచలముశెట్టిగారు

ప్రారంభోత్సవము జరుపునది,

దివాన్ బహద్దూర్ బి. మునిస్వామినాయుడుగారు.

ఫిబ్రవరి 26 తేదీ జరుగవలసిన మహాసభ కారణాంతరములచే మార్చి 25 తేదీకి నిర్ణయింపబడినది. కాని ఆతేదిన గవర్నరుగారు శాసనసభకరుదెంచి ఉపన్యసింతురు గాన శాసనసభ్యులరుదెంచుటకు వీలుకానందున ఏప్రిలు 2 తేది ఆదివారము జరుపునట్లు నిర్ణయింపబడినది.

కారణాంతరములచే మాటిమాటికి తేదులుమార్చవలసి వచ్చినందులకు మన్నించి రయితులెల్లరు విచ్చేయవలసినదిగా ప్రార్థన.

పుత్తేరి నారాయణరెడ్డి
ఆహ్వానసంఘాధ్యక్షుడు.

## మద్రాసు శాసనసభా వృత్తాంతాలు.

—(o)

ఉద్యోగేతర కార్యక్రమమును సాగించుటకు దినము ప్రత్యేకింప బడినందున యీమార్చిమాసమున మెట్టేటు ల్యాండు అస్సెస్మెంటుబిల్లు (రయితుబిల్లు) ప్రవేశపెట్టుటకు వీలులేదనియు, యీబిల్లునకు ప్రత్యేక సౌకర్యములనొసంగుటకు ప్రభుత్వమువారు నిరాకరించిరనియు, అందుచే ఆగస్టు మాసమున బిల్లు ప్రవేశపెట్టబడక వచ్చుననియు తెలియుచున్నది.

మంత్రి వర్గమునందు మరల కలకలము బైలుదేరినదనియు, ముత్తయ్యశెట్టిగారికి ([illegible] జమీందారు) మంత్రి పదవిని లభింప చేయవలయునని ప్రయత్నములు జరుగుచున్నవనియు అందులకు కుమారస్వామిరెడ్డిగారిచే రాజీనామా నిప్పించుటకో, లేక పార్టీవిరాటింగు పందు విశ్వాస రాహిత్యమును ప్రకటించుటకో ప్రయత్నములు జరుగుచున్నవనియు తెలియుచున్నది.

వివిధ మునిసిపాలిటీలు, లోకల్ బోర్డులలో ప్రధానామాత్యునిచేగావించిన యుత్తర్వుల న్యాయాన్యాయములను చర్చించుటకును, స్వదేశీప్రదర్శనములకు స్థానిక సంస్థలెట్టి సాయమును చేయరాదని బొబ్బిలిరాజాగారు గావించిన యుత్తర్వుల నిరసించుటకును బడ్జెటులో కోతతీర్మానము లుపపాదింప బడినవి. మంత్రివర్గమువారిపై సాముదాయకముగను ప్రత్యేకముగను విశ్వాసరాహిత్యమును ప్రకటించుటకు గూడ ప్రతిపక్షమువారు కోతనోటీసుల నొసంగియున్నారు.

## వాఙ్మయంలో, అమెండు మెంట్లు

వావిళ్ళవారి కావ్యములలో భాగవతంలో కుక్కింది అమెండు మెంటును బ్రహ్మశ్రీ అక్కపెద్ది విద్వ్యశాస్త్రిగారు నోటీసు నిచ్చిరట. రాబోవు కాన్ఫరెన్సులలో యీసవరణను గూర్చి చర్చ జరుగబోవుచున్నది. ఈసవరణను బలపరచుటకు కొందరులోకల్ బోర్డుసభ్యులతో పీఠనాయకులు చెన్నపురికి రైలు దేరనున్నారట.

భాగవతంలో సవరణ చేయవలసిన పద్యము

"వారిజాక్షులందు, వైవాహికములందు
ప్రాణవిత్తమాన, భంగమందు
ఓట్లయందున్యాయ, కోర్టులయందును
బొంకవచ్చు నఘము, బొందదధిప"

(మూడవపాదము మార్చిమే క్రొత్తగా చేర్చబడినది)

"విమర్శకుడు"

## నెల్లూరుజిల్లా రైతు మహాసభ

అయ్యా.

నెల్లూరు రంగనాయకుల పేటలో జరుగనున్న వ్యవసాయ ప్రదర్శనశాల (కందాడై వారితోట) యందు ఈ నెల తే 14 ది పగలు 3 గంటలకు నెల్లూరు జిల్లా రయితు మహాసభ జరుగనున్నది. ప్రస్తుత రయితు దుస్థితినిగూర్చి ప్రముఖుల వుపన్యాసములును, రాబున్న క్రొసెటిల్మెంటును గురించి చర్చించుటయు, జిల్లా రయితు సంఘమును చక్కని పునాదులపై నెలకొల్పుటయు, మొదలగు ముఖ్యాంశములు చర్చింపబడును. గాన, తాము ఈమహాసభను దయచేసి జయప్రదముగావింప ప్రార్థన. ఇట్లువిన్నవించు,

పొణ్ణూమున్నకృష్ణారెడ్డి, ఆనం వెంకటసుబ్బారెడ్డి,
దువ్వూరు బలరామిరెడ్డి, గండవరపు హనుమారెడ్డి

---

మద్రాసుశాసనసభ ఫిబ్రవరి 24 తేదితో ప్రారంభమై 1 తేదివరకు జరిగినది. తిరుగా మార్చి 11 తేది ప్రారంభమై 25 తేది వరకు జరుగును. 25 తేదినాడు గవర్నరుగారు శాసనసభ కరుదెంచి ఉపసంహారోపన్యాసము నొసంగెదరు. బడ్జెటు సెషన్ ఆనాటితో ముగియును.

జమీందారీ రయితు

11—3—33 శనివారము.

## జమీందారుల యెత్తులు

సంయుక్తరాష్ట్రపు జమీందారులును, మదరాసు రాష్ట్రపు జమీందారులును, మిగుల జాగ్రత్తకలిగి యెన్నియో ప్రయత్నముల సాగించుచున్నారు. ఇర్విన్ ప్రభువు వైస్రాయిగా నున్నదినములలో అయోధ్య జమీందారులు రాయబారము పోగా వారికి చక్కని హితవు సగబడెను. ఈ మధ్య సంయుక్తరాష్ట్రపు జమీందారులు విల్లింగ్డన్ ప్రభువును దర్శించి తమకు ప్రత్యేక సౌకర్యముల గల్పించి తమహక్కుల కాపాడవలసినదిగా కోరిరి. కాని ఇర్విన్ ప్రభువు కంటె వీరు జమీందారులపై కొంతయభిమానమును సూచించిరి. యిప్పటి మార్పు నేటి ప్రభుత్వ దృక్పథమునకు నిదర్శనము. జమీందారులను ప్రభుత్వము నేడు దగ్గర దీయుటకు సంకల్పించు కొన్నట్లు కొంతయనుమానింపవలసియున్నది-

మదరాసురాజధానిలో అందున తెనుగు జిల్లాల జమీందార్లతహతహ చెప్పనలవిగాకయున్నది. చిన్న చిన్న జమీందారీలనన్నిటిని అవిభాజ్యపు ఎస్టేట్లుగా చేయించుకొనుచున్నారు. ప్రతి జిల్లాలోను స్థానిక సంస్థల ఆక్రమించుకొని రేపటి శాసనసభల కెగబ్రాకుటకు తీవ్రప్రయత్నములచేయుచున్నారు- నేటిప్రభుత్వ మంత్రులలో సైతముఒక్కొకరుగా జమీందారులు దూరుకొనుచున్నారు. బొబ్బిలివారు ప్రధానమంత్రిత్వమునకు బూనుకొని అర్ధవత్సరమైననుకాలేదు, అప్పుడే రెండవ మంత్రిత్వమును ముత్తయ్య చెట్టిగారికి పట్టాభిషేకము చేయుటకు తీవ్ర ప్రయత్నములు సాగుచున్నవి. త్వరలోనే మూడవ మంత్రిత్వము గూడ జమీందారుల వశము చేసికొన ప్రయత్నింతురు.

ఇదిగాక హిందూదేశమున సాంఘికరాహిత్యపక్షమొకటి బైలుదేరదీసి దానికి తాము పెత్తనదారులుగానుండుటకై మన జమీందారుల పక్షమున వెంకటగిరి కుమారరాజాగారు ఢిల్లీకరిగి అచ్చటి సభలో అమృతవాక్కుల వర్షించి సభ్యుల నానందాబ్ధి నోలలాడించిరి. అబ్దుల్ రహీమాన్ అంతటివాడు కుమారరాజాగారిని గూర్చి తమకు అపరిచితమైనను రామస్వామి మొదలియార్ గారి వాక్కులతో పొగడు నప్పటికి పత్రికలంతయు మారుమోగిపోయెను. యీపన్నుగడతో జాయింటు పార్లమెంటరీ కమిటీలో కుమారరాజాగారికి పలుకుబడిలభింపగలదు,

తామునడుపు పత్రికలేగాక యితర జాతీయపత్రికలను సైతము తమవంకకు త్రిప్పుకొనుచున్నారు. ఇట్లు దేశనాయకులను, పత్రికలను, ప్రభుత్వమును జమీందారులు హస్తగత మొనరించుకొను చున్నారు- ఇకజమీన్ రయితుల గోలవినువారులేరు ప్రకటించు పత్రికలరుదు శాసనసభ్యులలో సాయపడనున్నవారికి సంఖ్యయు యీగోడు అర్థముగాదు- జమీన్ రయితులకు తగినసంఘములులేవు- ధనము లేదు- దేశమునపలుకుబడిలేదు- యీపరిస్థితులలో యిక్లేగడచిన వచ్చే సంస్కరణములలో జమీన్ రయితులు తీరని అపకారము ననుభవింతురు-

గాన అన్నిజిల్లాలలోను జమీన్ రయితులు నిద్రమేల్కొని జిల్లాసంఘములు స్థాపించి, రాష్ట్రసంఘమును బలపరచి తీవ్రాందోళనమునకు గడంగవలసియున్నది- గాన వెంటనే జమీన్ రయితులు మహాసభలగావించి కార్యోన్ముఖతకు పూనుకొందురని కోరుచున్నాము-

## రయితు రక్షణవారము.

రయితు రక్షణవారమున ఆచార్య రంగగారి ఆదేశానుసారము ఆంధ్రదేశమున పలుతావులనుండి ప్రభుత్వప్రతినిధులకు రయితుకష్టములగూర్చి రాయభారములు జని నివేదించిరి. అచ్చటచ్చట స్థానికాధికారులు తగురీతిని ప్రత్యుత్తరములనిచ్చి పులిమిపుచ్చిరి. అంతమాత్రమున బాధలనుభవించుచున్న రయితులకు లాభము లేదు. ప్రభుత్వమువారు స్థానికాధికారుల మూలమున రయితుకష్టముల నెరిగి వెంటనే నివారణోపాయములనరయుట ధర్మము. ఆచార్యరంగగారు రయితులోకమునకు చేయుచున్న సేవ ప్రశంసార్హము.

## స్వీకారము

"జన్మభూమి":—

ఇది యస్, జి, ఆచార్యగారి అధ్వర్యము క్రింద సాగుచున్న- త్రైవారపత్రిక వెల 0—0—3-తిరుగా ప్రారంభించినది 6-2-933 తేదిననేటికి నాంధ్రదేశమంతమునకల వరపెట్టుచున్నది- మాసోదరి, రయితులకు చేయుచున్న సేవ అపారము- ప్రతి సంచికయందును రయితుగోల మిన్నుముట్టింపచేయుచున్నది- అప్పుడే వేలకువేలు ప్రాకిపోవుచున్నవి- అందరికి అందు బాటునయుండుటకై శ్రమకోర్చి పత్రిక వెల 0-0-3 నిర్ణయించిరి- ప్రతిపల్లెయందును రయితు సోదరులు దీనినిచదివి స్వీయాభ్యుదయమునకు పాటుబడవలసియున్నది- సోదరి పత్రిక మాజీర్ణకుటీరమును దర్శించుచున్నందులకు వందనములు-

వైద్య ప్రవిద్య.

అనుమాస పత్రిక ప్రథమ సంచిక వందనములతో నందుకొంటిమి. ఇందువ్యవసాయకుల ఉపయోగము నిమిత్తము 27 చక్కని వ్యాసములుకలవు. వ్యవసాయకులకు యెన్నిపత్రికలేనియు తనివి దీరవు. కా

ని పోషించువారు తమవిధ్యుక్తము నెరుమిచే పుట్టిన మరు దినమే యెన్నియో పత్రికలు దివంగతములగుచున్నవి. పత్రికా పతనమున మన ఆంధ్రదేశము మిక్కిలి వెనుబడియున్నది. రయితు మేల్కొనక దేశము సౌభాగ్యవంతము కాజాలదు. రయితు సోదరులు పత్రికా పతనమునకు పూనుకొనిన యెన్నిపత్రిక లేనియు పఠనమునొందగలవు. ఈపత్రికా రాజమును సైతము రయితులోకము పోషింప కోరుచున్నాము. పత్రిక సం॥ చందా రు 3 లు. వలయువారు "సేద్యపు విద్య మాసపత్రికా మేనేజరు, నంద్యాల" అని వ్రాసిన బడయగలరు.

---

## నె॥ జి॥ జ॥ రైతు సంఘ కార్య నిర్వాహక సమావేశము.

---

తే 23-3-1933 ది సాయంత్రం గం॥ 6 లకు సూళూరుపేటలో జరుగును.

చర్చించు విషయములు.

1. సన 1342 ఫసలి సుక్కి బంజర్ల రిమిషను విషయమై జమీందారుగారి వద్దకు రాయబారమేగుటను గురించియు,
2. సూళూరుపేట యిలాకా కాల్వదినది పారుదల కాల్వలు, చెరువులు రిపేర్లను గూర్చి తగు చర్య జరుపుటను గూర్చియు.

అవసరములగు యితరవిషయములును. సభ్యులెల్లరును తప్పక విచ్చేయ ప్రార్థితులు.

ఇట్లు,
బద్దిపూడి వెంకటనారాయణరెడ్డి,
కార్యదర్శి.

## కొండలు కోనలు
### రయితులకు హెచ్చరిక.

కొండల కోనల విషయమై కలెక్టరువారు జిల్లాబోర్డు ప్రెసిడెంటు గారును రయితులు "ఈ సంవత్సరమునకు కొండలు కోనలు కయలించి మేపుకొనుటకుఅనుజ్ఞనిమ్మ" నివ్రాసియిచ్చుటకు సమ్మతించినట్లుగా జమీందారుద్యోగులు కొండరు గ్రామాలకు వచ్చిరయితులను నిర్బంధించుచున్నారు. అధికారులు అట్టి సమ్మతము జూపినది అబద్ధమేగాక మీరు మిక్కిలి రయితులను ఆవిధముగా వ్రాసి యివ్వమనుట న్యాయము కాదని సైతము పై యధికారులు రాజాగారికి సూచించినట్లు గూడ జవాబుదారిగల వారివల్లమాకు తెలియుచున్నది.

పుత్తేటి నారాయణరెడ్డి,
వెం॥ తా॥ రై॥ సంఘాధ్యక్షుడు.

## నెల్లూరువార్తలు

నెల్లూరు తాలూకా తహశీలుదారుగారి మోటారుకారు మూలపేటలో తేసయింటి ముందు పంచలో పెట్టియుండగా తే 1 ది రాత్రి మండసింగ్లెవరో తగుల పెట్టగా వెంటనే కనుగొని చల్లార్చబడినట.

కలిచేడుమైకా మైను వేలము 12 వ తేది వెంకటగిరిలోజరుగును.

వెంకటగిరి హరిజన అభ్యర్థి ఒకురూరు పెంచెలు మొలెక్టర్ పిటీషను వాయిదా ఏప్రేలు 20 తేదికి వేయబడెను.

వెంకటగిరితాలూకా బోర్డు మీటింగు 5-తేది మోపూరులో జరిగినది. బడ్జెటు అంగీకరింపబడెను. నెల్లూరు తాలూకాబోర్డు మీటింగు ఈ నెల 10-వ తేది నెల్లూరులో జరిగి బడ్జెటు అంగీకరింపబడెనది.

సూళూరుపేట తాలూకా బోర్డు మీటింగు మార్చి 22-వ తేదిన సూళూరుపేటలోను, రాపూరు తా॥ బో॥ మీటిగు రాపూరులో 22-వ తేదినను జరుగును.

రాపూరు తాలూకా బోర్డు ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటుగారికి టీపార్టీ 12—3—933 తేది ఆగిపోయినది-

సూళూరుపేట, వెంకటగిరి, గూడూరు, రాపూరు తాలూకాబోర్డుల అధ్యక్షులను సూళూరుపేటలో 23-3-33 తేది సాయంత్రము టీపార్టీ జరుగును- ఈసభకు తిక్కవరపురామిరెడ్డిగారు అధ్యక్షత వహింతురు-

తిక్కనజయంతి ఈనెల 17 తేది వెంకటగిరి కుమారరాజాగారి అధ్యక్షత క్రింద నెల్లూరులోజరుగును-

## రెండవ రాజకుమారుని సాక్ష్యము.

---

వెంకటగిరి డివిజన్ మోపూరు గ్రామ సన 1336 ఫసలి రిమిషను ప్రొనోటు స్మాల్ కాస్ దావాలో ప్రతివాదుల పక్షమున సాక్ష్యముచెప్పుటకు వెంకటగిరి మహారాజాగారి రెండవ పుత్రులు వెంకట రాజగోపాలకృష్ణయాచేంద్రుల వారు ఈనెల 6 తేదిన నెల్లూరు ప్రిన్సిపలు మునసబ్ కోర్టుకు వచ్చిరి. ఆదినము సాయంత్రము 4 గంటలకు విచారణ ప్రారంభమయినది. కోర్టుభవనమంతయు ప్రజాసమూహముచే క్రిక్కిరిసి పోయినది. సాయంత్రము 5½ గంటవరకు విచారణ జరిగినది. ప్రతివాదుల పక్షమున బి. రామస్వామయ్యగారును, వాదుల పక్షమున మాడభూషి నరసింహాచార్యులుగారును హాజరయిరి. ఆరోజు రామస్వామయ్యగారిచే సాక్షివిచారించబడెను. తిరుగా 8 తేదికి వాయిదా వేయబడెను. 8 తేదిన రెండవ రాజకుమారులవారు కోర్టుకరుదెంచిరి. వీరిని విరోధపక్షసాక్షిగా భావించి క్రాసుపరీక్ష చేయుటకు డిస్ట్రిక్టుకలెక్టరు వారి కోర్టునుండి కొన్నికాకితములు రావలసియున్నవని 3½ గంటలవరకువాయిదాతీసుకొనబడెను. తర్వాతరాజాగారి పక్షమున సయితము తద్వ్యతిరేకమగు కొన్నికాకితములు దాఖలు చేయవలసి యున్నవని రాజాగారిపక్షవకీలుగారు వాయిదానడిగిరి. సదరు కాగితములు దాఖలుచేయుటకు 17—3—933 తేదికి వాయిదా వేయబడెను. ఆ తేదిన తిరుగా విచారణ వాయిదా నిర్ణయింతురు.

(స్వం. విలేఖరి.)

[వీరిసాక్ష్యము మరుసంచికలో ప్రకటింపబడును.]

# యమలోకములో వింతలు విశేషాలు.

(మా స్వంత విలేఖరి)

యమపురి:— ఫిబ్రవరి 31 తేది.

నేనులక్కీనరిపోర్టర్లు 28 తేది రాత్రి 2 గంటలకు నెల్లూరు పెన్నానదిలో గండాలకు పోయుపుస్టేషనులో బండెక్కితిమి. అది స్పెషలు ట్రెయినగుటవల్ల నాటరింగుస్టేషనుల లోతప్ప మరెక్కడ ఆగిందికాదు. నాతోటిమరికొందరు పత్రికా ప్రతినిధులు కూడా ఆబండిలోనే బయలుదేరినారు. మేమంతా 30 తేది రాత్రి 9 గంటలకు యమపురికి ఉత్తరదిక్కు కంటోన్మెంటుస్టేషనులో దిగాము. రాత్రిపూటవుటచేత యే హోటలుకు పోదామాయని మేము విచారించుకొనుచుండగా ఒకతంజావూర్ బ్రాహ్మణ హోటల్ ప్రతినిధి అయ్యర్ కుర్రవాడు మావద్దకువచ్చి "హోటలుకువరియా" యని మమ్ముల హెచ్చరించుకొనెను. నేను నెల్లూరువాడనగుటచే అరవంతెరుచుగా చెవులోబడుతుండటం మూలాన నేనందుకొని వచ్చి రానిఅరవంతో "ఆమా" అన్నాను. అంతట అతనే బండిటేసుకొచ్చి మాసామానంతా వేయించుకొని మమ్ములతోడుకొని బజారుప్రక్కపోయ్యాడు. అచ్చట ఒక గ్యాస్‌లయిటు ముందుబండిఆగింది "పరుగుళ్లో" అని అయ్యర్ కుర్రవాడన్నాడు. దిగాము. గ్యాస్‌లయిటుముందు పెద్దబోర్డుమీద "తంజావూర్ బ్రాహ్మిన్ హోటల్" అని యింగ్లీషుతో వ్రాయబడియుంది. దాని క్రింద తెలుగుతో "యిచ్చటభోజనము వేయబడును" అనిచేతగాని అక్షరములతో వ్రాసుంది. అదిమాచేటప్పటికి ఆశ్చర్యమేసింది. ఈశ్వరసన్నిధయ్యా! యెక్కడకొచ్చానురరా అరవోళ్ళు అనుకుంటూ లోపల పోయ్యాము. లోపనమాస్తే ఓయబ్బా! ఎక్కడజనం, మొన్న జిల్లాబోర్డుఎలెక్షను నాడు టౌనుకురోడ్డులో కనుపడ్డవారికంటె యెన్నోరెట్లు జాస్తి. గుమ్మముదాటిలోన ప్రవేసించేటప్పటికి ఉన్నతమయిన యర్రటి మనిషి తాటిచెట్టుకంటె కొంచెంతక్కుగా వున్నాడు, దట్టిగట్టి నోటినిండా తాంబూలంనుక్కి మాట్లాడిస్తే యెదుటవారి ముఖానంతా చిత్రజల్లులు గురిపించేతాంబూల చర్వణాతో ప్రొప్రయిటరుగారు బల్లప్రక్క కూర్చొని డబ్బుతీసుకొంటున్నాడు. నన్నుచూస్తూనేగనే "ఎప్పుడువా వస్తిరి" యని పలకరించాడు ఆయుసభ్యపు రెండు తెనుగుముక్కలు వినేసరికి ప్రాణం లేవొచ్చినట్లయిందినాకని. ఆహా ప్రొయిటర్ను గుర్తుపట్టలేక పోయ్యానుగాని ముఖం, ధ్వని, యెక్కడనో పరిచయ చిహ్నాల జ్ఞప్తికిదెస్తుంది. ఆంతటవారే యెదలుపెట్టారు. మొట్టమొదట నెల్లూరులో కాఫీహోటలు రుచిచూపింది తానేననియు, రామకృష్ణయ్యర్ భార్యద్వతీయుడుగా నెల్లూరువచ్చినప్పుడు నిలువనీడిచ్చి సంచిమొదలిచ్చి వ్యాపారంలోకి దింపిందితానేననియు, ఆకృతిజ్ఞత్వాంచివరదాకా తనమీద వుంచాడనియు, తనస్వయంకృతాపరాధం వల్ల బ్రాహ్మణత్వం నిలుపుకుందామని "సోమపానార్థం సురాపానం సమర్పయామి" అని కొంచెకొంచెం ప్రారంభించి పోటీ పందాల గెలిచాననియు, చెప్పాతా తనపేరు "ఆళ్వారు" అన్నాడు. పెద్దబజారులో చివర దినాల్లో హోటలుపెట్టిన్న ఉదంతంజ్ఞప్తికొచ్చింది. ఆపరిచయంతో అక్కడున్నన్నినాళ్ళు భూలోకస్వర్గంజేశాడన్నమాట. ఆరాత్రి భోంచేసి ప్రత్యేక రూములో పడుకొని తెల్లవారగానేకాల్యకృత్యాలుతీర్చుకొని యిడ్లీలి, సాంబారు, కాఫీ. యిత్యాదికములు పుచ్చుకొని బైటకొచ్చి వాకిట్లో పక్కాకులంగట్లో తాంబూలం తీసుకొని వేసుకొంటూ రోడ్డుమీదకొచ్చాను. అక్కడ జట్కావాణ్ణే పిలిచి చిత్రగుప్తుడిఆఫీసుకు మాట్లాడుకున్నాను బానిలోయెక్కి వెళ్ళాను. చిత్రగుప్తుడి ఆఫీసు గుమ్మముపద్దదిగి జట్కావానికి బాడుగివ్వడంలో కావలసినంత రచ్చయిపోలీసువాడిని పిలిచేవరకు బండివాడు దారికొచ్చి మాట్లాడు కొన్నదానికంటె యిబ్బడి బాడుగతో నన్ను ప్రాణంతోవదిలాడు. అంత లోనికేగి బయటవున్నబంట్రోతు చేతికి విజిటింగ్ కార్డుయిచ్చి యజమానికి యివ్వమన్నాను. కార్డుచేతికివ్వడంతోట చేయిచాపాడు. పనిఅయినతర్వాత అడగడం సబబేకాని ముందేమిటయ్యా అన్నాను. అదిమామూలు అన్నాడు. ఓహోఇది జమీందారుద్యోగుల మాదిరిందే లిమాష నిప్పిస్తానిలంచం నాకేశేమాదిరి అనియనుకొంటూ జమీందారీలలో చూస్తుండేవాణ్ణి కాబట్టి చెయిమెరుగు కాకపోతే చెడపతాడ్రాస్వామీ! అనుకుని వెంటనే రూపాయయిచ్చాను. తక్షణం లోనికెళ్ళివుత్తర్వుపొంది నన్నుతీసుకొని నాతోటికుర్చీఒకటి తెచ్చి అక్కడవేసి మర్యాదచేసి కూర్చోమన్నాడు. కూర్చున్నాను.

చిత్రగుప్తుడికినాకు సంభాషణ కొంతనడిచింది. అంతటనేను నెల్లూరునుంచి 40 సం॥ల యివలవచ్చిన గొప్పవారిని చూడాలన్నాను. గుమాస్తానుపిల్చి "యితను ప్రెసిడెంటు యితను కోరిన విషయాలంతా చూపెట్టు"అన్నాడు. అంతట గుమాస్తా పోనులో ఎవరినో పిలిచాడు వెంటనేవచ్చాడు. అతన్నితోడిచ్చి నన్నుపంపాడు.

మొదలనేను రేబాల లక్ష్మినరసారెడ్డిగారిని చూడాలన్నాను. ఒక పర్లాంగు దూరము తీసకపోయినాడు అక్కడ ఒకగది చూపాడు. వాకిట బోర్డువేసియున్నది. R. L. Reddi (రే. ల. రెడ్డి) అని వున్నది. కటికీవద్దకేగు నప్పటికి "నీవు నెల్లూరికి నరిన్ని పురపాధ మచటికే చనిగదా అరయనలయ్యు" అనేకవ్యములోన చదువుచుండగా వీనులకు వినబడ్డది. లోనికేగినా. రెడ్డిగారికి తలగుడ్డ పైన వెంకటగిరి జరీవల్లెవాటు, నల్లటిలాంగు కోటు, వేసికొని ప్రయా

బోన్ముఖుడై కుర్చీలో కూర్చొనియుండుటయు, శాస్త్రిగారుశిరోవేష్టము, పైన కాశ్మీరశాలువ, కోటు,వేసికొని లావుపుస్తకాన్నొకడు చేతబట్టుకొని పూర్వోక్త పద్యాన్ని వల్లించడంగాంచాను ఓహో! నమస్కారం అనుకున్నాను. నమస్కారాలన్నాను. ఇరువురు నావంక దృష్టులు నిగిడ్చి కూర్చోండి అన్నారు. నాపూర్వోత్తరాలు నేనే చెప్పాను. నాది నెల్లూరనడంతోటే ఇరువురు ఆనందంలో మునిగిపోయ్యారు. తమ తమ కుటుంబ విషయాలు అడిగారు. చెప్పాను. అంతలో శాస్త్రులుగారుండి మా మేనాదిరెడ్డిగారు క్షేమముగాయున్నారా? అన్నారు. వార్ని ఈమధ్య చూడలేదుగాని బాగున్నారంటిని. "వారింతకాలము రాకుండుంటకు గత్యంబెయ్యది" అని యడిగిరి. అదేమో నాకు తెలియదు. ఒకటిమాత్రం చెప్పగల. వారుగూడ టికెట్టుకొని శిద్ధంగున్నారు బండి ఆలశ్యమేగాని వారిదేమి ఆలశ్యములేదనుకొంటానన్నాను. అంతట శాస్త్రులవారు తనమనుమణ్ణి గూర్చి ప్రస్తావించగా నాకు తెలిసినముక్కలు రెండుచెప్పాను. అంతట శాస్త్రులవారు నమస్కారాలతో లేచారు. మేము లేచాము. రెడ్డిగారు నేను వాకిట్లోదాక పోయి వారిని సాగనంపి వచ్చాము. నేను నెల్లూరువాణ్ణి వచ్చినందున రెడ్డిగారి బైట ప్రయాణ మాపుకొని దుస్తులంతా తీసివేసి కచ్చేరి చావడిలోకి వచ్చాడు. అచ్చట కూర్చొని సంభాషణ ఆరంభించాము.

"విమర్శకుడు" (సశేషము.)


## త్రిలిఙ్గ.

మత, సాంఘిక, ఆర్థిక రాజకీయ పారిశ్రామిక విషయముల నిష్పక్షపాతముగ చర్చించు వార పత్రిక. సంవత్సర చందా రూ 2¼ మాత్రము. వలయువారీ క్రింది చిరునామాకు వ్రాసి తెప్పించుకొనుడు.

మేనేజరు 'త్రిలిఙ్గ' 323, హైరోడ్డు, తండియార్పేట, మద్రాసు.


## తిప్పరాజువారి సత్రం మరమ్మతు సంఘము.

నెల్లూరు పురమధ్యమున నుండు తిప్పరాజువారి సత్రమును అభివృద్ధి పరచి చక్కని స్థితికి తెచ్చుచు నుద్దేశముతో పై సంఘమును తే 1-10-32 దిన స్థాపించితిమి. తదాదిగ స్వల్ప మరమ్మత్తులు చేయుచు అభివృద్ధి మార్గముల నేర్పాటు చేయుచున్నాము. త్వరలో వ్యవహారములు జరిపి సత్రపుదాతగారి వీలునామా ప్రకారము ట్రస్టీల నేర్పాటుచేయు ప్రయత్నములకు తోడ్పడ కోరడమైనది. వ్యవహారములు జరుపుటకు స్టాంపుఖర్చులు మొదలగు వానికి రు 200-0 0 కావలసియున్నది. ఈ ధర్మకార్యమునకు యెల్లరు సహాయపడ కోరుచున్నాము.

నెల్లూరు, 20—2—33. } ఇట్లువిన్నవించు, టి. పద్మనాభయ్య, తాత్కాలిక కార్యదర్శి.

## గూడూరు.

పి. ఆర్. క్లబ్బువారి యాజమాన్యమున, 1933 ఏప్రెల్ మొదటివారములో టెన్నిసు పందెములు, సింగిల్సునందును, డబుల్సునందును నిరుటివలె జరుగనున్నవి. నెల్లూరు, చిత్తూరు యందలి క్లబ్బులు, హైస్కూళ్లు, కాలేజిలు, పబ్లికు సంస్థల వారు మాత్రము పోటీ చేయవచ్చును. తే 15—3—33 ది వఱకు పందెములకు దరఖాస్తు లంగీకరింపబడును. పూర్తివివరములకు టూర్నమెంటు కార్యదర్శి శ్రీయుత ఎ. లక్ష్మీనారాయణయ్య బి. ఎ., యల్. టి., హెడ్మాస్టరు బోర్డు హైస్కూలు, గూడూరు, నెల్లూరుజిల్లా అని వ్రాయవలెను.

## నె॥ డి॥ ము॥ కోర్టులో

E. A. 1287 of 1932

O. S. No. 602 of 1930

Between

కోలేటి వెంకటాచలంగుప్త & బ్రదర్సు

వాదులు

And

యన్. వి. కృష్ణమరాజు—ప్రతివాది.

యీ ప్రతివాది మీద వాదులు పొందియుండు డిక్రీని అసలు జరుపుకొనుటకు యీకోర్టుకు పెటిషను యిచ్చుకొన్నందుకు కోర్టువారు తే 8-4-33 దికి వాయిదావేసి యున్నారు. గనుక ఆనాటికి యీ ప్రతివాది హాజరుకాని యెడల అతని పరోక్షమున యీ దావా విమర్శించి తీర్మానించబడును.

నెల్లూరు; 9—3—33. } కె. సుబ్రహ్మణ్యం, వాదుల వకీలు.

## ధాన్యపు ధరలెందుకుతగ్గినవి?

విదేశములనుండి మనదేశమునకు దిగుమతియైన బియ్యములెక్క యీక్రింద చూడనగును.

| | | టన్నులు. |
|---|---|---|
| 1932, | ఏప్రిల్ | 505 |
| | మె | 3780 |
| | జూన్ | 4340 |
| | జూలై | 1243 |
| | ఆగస్టు | 1192 |
| | సెప్టెంబరు | 1320 |
| | అక్టోబరు | 1252 |
| | నవంబరు | 3612 |
| | డిసెంబరు | 4395 |
| 1933, | జనవరి | 4572 |

పై విధమున బియ్యము దిగుమతియగుటచే మనదేశపుధాన్యమునకు ధరలుపడిపోయినవి. యితరదేశములలో నయినచో ప్రభుత్వమువారు వెంటనే దిగుమతిపన్నుల విధించి తమరయితును కాపాడుదురు. మనదేశమునకు దిక్కేది?

## నకలుమందులను చూచి మోసపోకుడు

నలుబది సంవత్సరములుగా ప్రఖ్యాతిజెందినది. కేవలము బాధసాధని.




శిరశ్శూలముల మాన్పును, వాయుపోటుల బాపును, పార్శ్వపు నొప్పుల పారదోలును, పొట్ట పోట్లను, తేలుకుల ఛేదించును, వాపుల రూపుమాపును, దగ్గును భగ్గించును, దురదను తొలగించును.

మద్రాసు, మైసూరు రాష్ట్రములకు
ముఖ్యపు ఏజంట్లు,
ష్యాం అండు కంపెని,
6, బందరువీధి, మద్రాసు



అమృతాంజనం డిపో,
మద్రాసు, బొంబాయి,
కలకత్తా.


## ఉపాసనా పరిభావము

మీ ధనిమత్తులోని ప్రశ్నలకు దివ్యదృష్టివలన సరియైన సమాధానములను వ్రాసి వి.పి. పోస్టుద్వారా మీకు పంపుదుము. 6 ప్రశ్నలకు రూ. 1-4-0. 12 ప్రశ్నలకు రూ. 2-4-0.

మీ గ్రహములయొక్కయు, నక్షత్రములయొక్కయు, లేక నూతనస్థలముల యొక్కయు ప్లానులను చేసినయెడల వాటియొక్క బలాబలములును; అందు, వాస్తు, - భూగర్భశల్య జల ప్రయోగ పిశాచాది దోషము లున్నవో లేవో పరిశోధించి చూచి యుండినచో వాటికి శాంత్యాది విధులు మొదలగు ప్రతియంశములను విపులముగా మీకు తెల్పుదుము.- ఇందులకు వి. పి. ఖర్చులతో సహా వ్రాస్తే రూ.2-40

సమస్తరోగములు తొలగుటకును ప్రయోగ లక్షణములు వీడిపోవుటకును భూత ప్రేత పిశాచముల బాధలు తొలగుటకును సమస్త వశీకరణాదులకును మహామంత్రయంత్రతా యెత్తులుపంపుదుము.

అడ్రెసు:— "మాంత్రిక చక్రవర్తి"
ప్రొఫెసర్ అంజక్, ఎం. ఏ,
అక్కల్పేట్టు, బెజవాడ.


## డెర్బి స్వీప్ (లాటరీ)

మ్యూచుయల్ క్లబ్బు లిమిటెడ్ వారిచే నడుపబడు చున్నది.

చందా, మామూలు టపాకు తే 26 4 33 ది వరకు టిక్కెట్టు 1-కి రు 4 12 0 లు.

## ఐరిష్ హాస్పటలు వారిచే నడుపబడినది.

ది 12-4-33 వరకు మామూలు టపాకు టిక్కెట్టు 1-కి రు 7-12-0

ఈపై రెండుక్లబ్బులటిక్కెట్లు నిమిత్తమున్ను ఈదిగువ అడ్రెసుకు సొమ్ముతో ఆర్డరుపంపుకోవచ్చును

టి. వి. రెడ్డి,
అధికారమును పొందిన ఏజెంటు.

రాజమండ్రి (తూర్పు గోదావరిజిల్లా.)


సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు, నెల్లూరు, వెంకటాద్రిమానాయుడు, జమీందారీరైతు ముద్రణాలయం, రాజవీధి, నెల్లూరు.